# బిత్తల రాజు

రచన :
కమలా బకాయా

బొమ్మలు :
ఆండ్రే కుమార్



# బిత్తల రాజు

రచన : కమలా బకాయా

బొమ్మలు : ఆంద్రే కుమార్

మంచి పుస్తకం



అనగనగా ఒక రంగేళి రాజు,
బట్టలంటే భలే మోజు.

ఎంతో మంది వ్యాపారులు,
పగలు, రాత్రి జాతరలు.

పట్టు, ముఖమల్ తళతళలు,
రాజు కళ్ళల్లో మిలమిలలు.

రాజుకు ఉంది బట్టల పిచ్చి,
కొంటాడు, ఎంతైనా ఇచ్చి .

కుట్టించి కొత్త దుస్తులు,
పోయేవాడు భలే షోకులు.

అయినా ఆ మోజు తీరనిది,
కొనే బట్టలకు అంతమేది.

ఎక్కడ చూసినా బట్టల గుట్టలు,
కుడి ఎడమల దొంతరలు.



రాజుకి ఉన్న బట్టల మోజు,
పెరిగేది రోజు, రోజు.

ఇదే అవకాశమని ఇద్దరు కిలాడీలు
చేరారు రాజమహలు:

"బట్టలు నేసే పనివాళ్ళం,
పనిలో ఎంతో నిపుణులం!

"బంగారంతో తీగలుచేస్తాం,
ఆ తీగలతో బట్టలు నేస్తాం.

"వెండితో అల్లుతాం అల్లికలు,
ఎందుకులే జాజులు, మల్లికలు.

"మా నేతలో రంగులు భలే,
చూసి సిగ్గుపడతాయి పూలే.

"మా బట్టలు అద్భుత సృష్టి,
తగులును చూసే వాళ్ళ దిష్టి.

"ముఖ్య విషయం చెప్పాలండీ,
జ్ఞానులకే అవి కనపడునండి!"





కాదు వాళ్ళు నేతగాళ్ళు,
మాటలు అల్లే మాయగాళ్ళు!

రాజు ఎంతో పొంగిపోయాడు,
వాళ్ళ వలలో ఇట్టే పడ్డాడు.

"వాళ్ళకి సకల సౌకర్యాలు కల్పించండి,
కొత్త బట్టలకు కావలసినవి ఇవ్వండి."

రాజు తలుచుకుంటే ఇంకేమి కొదవ,
క్షణాలలో అన్నీ సమకూరవా!

ఒక భవనం వారికి కేటాయించారు,
వెండి, బంగారు రాశులు పోశారు.

రాత్రి, పగలు నేతగాళ్ళ హడావిడి,
ఇతరులు మాత్రం లోనికి రాకూడదండి.

ఇంకా తెండి బంగారం, వెండి,
ఇలా నెలల తరబడి సాగిందండి.

రాజు: "ఏదీ, నేసిన బట్టని చూపు."
నేతగాళ్ళు: "ఇదిగో అయిపోతోంది రేపు, మాపు."

చివరికి రాజు విసిగిపోయాడు,
చూసిరమ్మని మంత్రిని పంపాడు.





వెండి, బంగారాల రాశులు లేవు,
నేసిన బట్టల మూటలు లేవు.

బట్టనేసే చక్రం ఖాళీ,
గది నాలుగు మూలలూ ఖాళీ.

బట్ట నేస్తున్నట్టు చేతులు తిప్పే,
దారాలు ఎంచుతున్న మాటలు చెప్పె.

బాగుందంటూ హావభావాలు,
మెచ్చుకుంటూ ఆహా, ఓహోలు.

మంత్రి గదిలోకి వచ్చాడు,
చూసి, అవాక్కయ్యాడు!

వాళ్ళు చెయ్యితిరిగిన నేతగాళ్ళా,
లేక మాటల మాయగాళ్ళా?

నోరు తెరిచి మంత్రి నిలబడిపోయాడు,
నిజం ఏమిటో తెలుసుకోలేకపోయాడు.



మంత్రికి ఏమీ పాలుపోలేదు,
ఏం జరుగుతోందో తెలియ లేదు.

నిజంగానే బట్టలు లేవా,
లేక తనకే తెలివి లేదా?

మంత్రి అయోమయాన్ని వాళ్ళు చూశారు,
కన్నుగీటి మెల్లగా మాట కలిపారు.

"మంత్రిగారూ, బాగున్నారా!
ఈ బట్టలు చూడండి బాగున్నాయా!"

"ఇవిగో రంగుల తళతళలు,
వెండీ, బంగారు అల్లికలు."





మంత్రికి ఏమి చెప్పాలో తెలియలే,
నోట మాట బయటకు రాలే.

బట్టలేదంటే నాకు తెలివి లేదంటారు,
కట్టబోయే రాజే చూసుకుంటాడు.

నేతగాళ్ళనే అతడూ అనుసరించాడు,
బట్టను వేనోళ్ళ ప్రశంసించాడు:

"నేశారు అద్భుత వస్త్రం,
మీ ఇద్దరికే ఇది సాధ్యం!"

మంత్రి దర్బారుకి తిరిగి వచ్చాడు,
ప్రశంసల మూటలు విప్పాడు:

"ఆహో రాజా! ఏమి పనితనం,
ఏమని చెప్పను బట్టల అందం!

"బంగారు లతల హొయలు,
రత్నాల పూల సౌరభాలు.

"చూపిన వాళ్ళకు మతి పోగొట్టే,
కడితే కట్టాలి ఇటువంటి బట్టే."

సభికులు వంతులవారీ వెళ్ళారు,
ఖాళీ గది చూసి బిత్తరపోయారు!

జరిగేది తెలియక తన్నుకున్నారు,
తెలివి లేదంటారని మిన్నకున్నారు.

ఒకరిని మించి ఒకరు పొగిడారు,
మాటల కోటలు కట్టారు.

చివరికి వచ్చింది రాజు వంతు,
అతడి కుతూహలానికి లేదు అంతు.

కళ్ళు పొడుచుకుని చూశాడు,
ఒకసారి కళ్ళు నులుముకున్నాడు.

బట్టలు అక్కడ లేనే లేవు,
వెండి, బంగారం అసలే లేవు.

నేతగాళ్ళు వాటిని దాటేశారు,
కట్టు కథలతో అందరినీ నమ్మించారు!

'సభికులు చూసి మెచ్చిన వస్త్రాలు,
ఎక్కడ వాటి ఆనవాళ్ళు?

'అందరికీ తెలివి ఉందా,
నాలోనే అది కొరవడిందా?



'బట్టే లేదని అంటే,'
నాకు తెలివి లేనట్టే.

'అందరూ బట్టను చూశారు గదా,
ఉందని అంటే సరిపోతుంది గదా.'

రాజు కూడా నలుగురికీ వంత పాడాడు,
తనకు చేతనైనంత బట్టలను పొగిడాడు.

నేతగాళ్ళు తమ పని అయ్యిందన్నారు,
తమకి ఇంకా శలవియ్యమన్నారు.

ఇచ్చారు వారికి నజరానాలు,
వెంట పంపారు ధనరాశులు.





కుట్టాలి రకరకాల దుస్తులు,
వెళ్ళాయి కుట్టేవాడికి పిలుపులు.

బట్టాలేదు, గిట్టా లేదు,
నాటకాలకు అంతే లేదు.

రాజుకి కొలతలు తీశాడు,
కత్తెర టకటకలాడించాడు.

ఇది అంగీ, లాల్చీ, జుబ్బా,
ఎంతో బాగా నప్పుతుంది, అబ్బా!

సూదులు గాలిలో నాట్యమాడాయి,
జలతారు బట్టలు అన్నారోయి.

ఇది పైజామా, ఇది అంగరఖా,
అంటూ వేశాడు అందరికీ బురఖా!



ఇలా బట్టలు ఎన్నో తయారయ్యాయి,
వేసుకోవటమే ఇక తరువాయి.

వచ్చింది రాజు పుట్టినరోజు,
అందరికి చూపాలి తన బట్టల పోజు.

రాజుకి పైజామా తొడిగారు,
లాల్చి, జుబ్బా వేశారు.

పక్కన అద్దం ఉంచారు,
బట్టల అందం చూపారు.

రాజుకి మనసులో అనుమానం,
మిగలదు కదా సిగ్గు, అవమానం.

సభికులందరూ నిజాన్ని నొక్కిపెట్టారు,
'వాహ్! వాహ్!' అంటూ వంతపాడారు.

ఊళ్ళోకి బయలుదేరింది ఊరేగింపు,
ఇక చేయాలి ప్రజల కళ్ళకు విందు.





రాజు వంటిమీద లేదు నూలుపోగు,
ఇలాగే అంతా ఊరేగు.

"కాలి నడకనే వెళతా,
బట్టల అందం చూపుతా.

"ప్రజల తెలివి తెలుస్తుంది,
బట్టలు లేవంటే తల తెగుతుంది."

ముందూ, వెనకా వందిమాగధులు,
రాచదుస్తుల ధగధగలు.

మోగుతున్నాయి బాజా భజంత్రీలు,
వెనకమున్నారు సేనానీ, మంత్రులు.

మధ్యలో ఉన్నాడు రాజు,
పెడుతున్నాడు పోజు మీద పోజు.

అందరితో కలిసి రాజు సాగాడు,
కలల పల్లకిలో ఉన్నాడు.





కొత్త బట్టలతో తమ దేవర,
ప్రజలకు అది ఒక జాతర.

రాజును చూడాలని గుంపులుగా వచ్చారు,
తీరా చూశాక దిమ్మర పోయారు!

ప్రజలు గుడ్లు మిటకరించారు,
కొందరు నోళ్ళు వెళ్ళ బెట్టారు.

ఏది లాల్చి? ఏది పైజామా?
ఇది కలా? నిజమా?

రాజు పూర్తి నగ్నంగా ఉన్నాడు,
కానీ నిజాన్ని చెప్పే వాడెవడు?

బట్టలు లేవంటే-తెలివిలేని వాళ్ళమవుతాం,
నలుగురితోపాటు 'భేష్' అందాం!

గుంపులో ఉన్నాడు ఒక పిల్లవాడు,
లోకం పోకడ తెలియనివాడు.

బిత్తల రాజుని చూశాడు,
గుట్టు రట్టు చేశాడు:

"చెట్టు మీద పిట్టల్లేవ్,
రాజుకేమొ బట్టల్లేవ్!"

**బిత్తల రాజు**

రచన : **కమలా బకాయా**

బొమ్మలు : **ఆంద్రే కుమార్**

అనువాదం : **కె. సురేష్**

Published in Hindi 'Raja Nang - Dhadanga Hai' by Pratham Books under 'Read India' Programme. Printed in Telugu with thanks to author, illustrator and Publishers.

ముద్రణ కాలం : **డిసెంబర్, 2009**

ప్రతుల సంఖ్య : 3000

వెల : **రూ. 20/-**

ISBNo. 97-93-80153-21-6

ప్రచురణ, ప్రతులకు:
**మంచి పుస్తకం**
C/o. వాసన్, 12-13-452, వీధి నెం. 1,
తార్నాక, సికింద్రాబాద్ - 500 017.
ఫోను: 94907 46614
email: info@manchipustakam.in
website: www.manchipustakam.in

ముద్రణ:
**చరిత ఇంప్రెషన్స్,**
1-9-1126/బి, అజామాబాద్,
హైదరాబాద్-20
ఫోన్: 040-2767 8411





కమలా బకాయా (1900-1973) కాశ్మీరుకు చెందిన మహిళ. 1930లో మాంటిసోరి పద్ధతిలో మేడమ్ మాంటిసోరి నుంచి స్వయంగా శిక్షణ పొందిన నలుగురిలో ఆమె ఒకరు. ఆమె దేశానికి తిరిగి వచ్చి లాహోర్‌లో మాంటిసోరి పద్ధతులతో బడి ప్రారంభించారు. పిల్లల కోసం అనేక పాటలు, కవితలు రాశారు.



ఆంద్రే కుమార్ ఫ్రాన్స్‌కు చెందిన చిత్రకారిణి.





మంచి పుస్తకం



978-93-80153-21-6